## — కథాసంగ్రహం —

రామనాథం విదేశాలకు వెళ్ళివచ్చిన పెద్ద లాయరు. అంతేకాక బాగా డబ్బున్నవాడు. అతని అసిస్టెంటు సుబ్బు. కాంచన అనే ఒక అందమైన అమ్మాయి జూనియరు లాయరుగా రామనాథంవద్ద చేరుతుంది. రామనాథం కాంచనని ప్రేమిస్తాడు.

వీరు ముగ్గురు ఒకరి ఆహ్వానంపై సోమయ్య అను జమీందారు యింటికి వెళతారు. సోమయ్యకు ఊటీలో బంగాళాలుమీద చాలా ఆస్తిగలవాడు. సోమయ్య గారాలపట్టి బేబీ.

ఒకనాడు కాంచన సోమయ్య విహారానికి వెళ్తే అచ్చట రాజా ఒక బస్సువద్ద మూర్ఛిల్లి వుంటాడు. రాజానిచూసి కాంచన గుర్తుపట్టి తనక్లాస్ మేట్ అని తెలుసుకొని అతనిపై అనురాగం నింపుకుంటుంది. కాని ఇది రామనాథంకి ఇష్టముండదు. రాజాపై ఒక ఆరోపణ పడుతుంది — బ్రిటిషువారికాలంలో ఒక పోలీసు ఆఫీసరుని చంపినందుకు.

అనేకమంది దుండగులు రాజాని చంపటానికి ప్రయత్నిస్తారు.

కాని రాజా నిరపరాధా ? అసలు హంతకుడెవరు ? రాజా ఎలా రక్షింపబడతాడు ? రాజా కాంచనలు కలుసుకుంటారా ? తెరపై చూడండి.

రచన : ఆరుద్ర

పాడినవారు : పి. సుశీల

హృదయం పులకించదా
కన్నెయిదే వన్నెయిదే
కలియమని చిలిపివలపు
ఉసిగొలిపి అలరించదా ||హృ||
నెలతలచూడని మునివరులు
వలచెడి జిలిబిలి పరువమిది
యౌవనమాధురి భోగమిది
సమ్మోహ రస కలిత పాత్రయిది ||హృ||
అందము నిన్నే వలచినదీ
ఆమనిరాతిరి నిలిచినదీ
ప్రాయము వెళితే మరిరాదూ
పలుతీయనివలపుల తేలవయ్యా ||హృ||
చక్కనిసమయం వచ్చినచో
సంతోషం నిన్నే పిలిచినచో
నాలోనీవు వెలసినచో
నా బ్యాలాడును వయసోహో ||హృ||

## పాట 2

రచన : ఆత్రేయ　　　　　　పాడినవారు : పి. సుశీల & పి. బాల సుబ్రహ్మణ్యం

పురు : నీమనసే కోరిరమ్మంది - నిను
నామనసే సుధ యిమ్మంది

స్త్రీ : నీమాటే యిక నిజమైతే - తొలి
వలపంతా నీధనమంది

పురు : కులుకులిడే పూరించికొనమంది - నీ
పలుకులలో రుచులు చిలకమంది

స్త్రీ : తేనియలా వలపు చూడమంది - తమి
తీర్చమనే కోర్కె మానమంది　　　　॥నీ॥

స్త్రీ : హద్దుమీర ప్రేమ ఆగమంది - యిలా
యిద్దరినీ బింకం నిలపమంది

పురు : వన్నెలవయసే మాటుపరచమంది - నన్ను
వలపులబాధనేమో ఓర్చమంది

పురు : నా మమత యిదియే తెలపమంది - మన
చెలిమిచవే ఎదలకలపమంది

స్త్రీ : రాగమందే కలసిమెలగమంది - బిగి
కౌగిలివిడక కరిగిపొమ్మంది.

పాట 3

రచన
ఆరుద్ర

పాడినవారు :
పి. సుశీల & పి. బాల సుబ్రహ్మణ్యం

స్త్రీ : వలపులుగొనుమా వన్నెలుకనుమా - ప్రేమ నీకు లేదా

పురు. ఆమనివిలసవై ప్రేమలమొలకవై - చెంతచేరలేదా - చేరి రగడచేయలేదా

స్త్రీ : మమతల నీయమని నను నిలిపి - తేనె మనసును దోచెను తొలిచూపే

పురు : కమ్మనిమనసే దాచినచో - అల్లరిచేయును నాచూపే

స్త్రీ : చెలిమిగ నీచేయినను డాసి - నా సిగ్గుల వన్నెలు దూసినవి

పురు : నీవయసే యిటుకుసుమింత, యిది లాలనచేయగ శుభవేళ

స్త్రీ : పరువపుముచ్చట పిలుచునట - నీ మెడపైన మాలిక వేయునట

పురు : తీయనికోరిక రగిలెనట - అది హాయిగ మిలమిల లాడెనట

స్త్రీ : కన్నియనిన్నే కోరెనట - చేరి కవ్వించగ పరువం పండెనట

పురు : ఇరువురి ఎదలు యిలమరిచెనట - నేడు అరుదైన సుఖమిదె దొరికెనట.

పాట 4

రచన: ఆరుద్ర

పాడినది: పి. నాగేశ్వరరావు & పి. బాలసుబ్రహ్మణ్యం

రాజా : వినరా పక్షీ వినరా - ఏ(నామూర్తా ఉడకవుపప్పులు
ఎత్తులు పారవురా ॥వినరా॥
ఆశలుమాత్రం బారెడువుంటే - అదృష్టమొస్తుందా
కుప్పు : మీసం మూరెడు పెదదివుంటే - రోషంవస్తుందా
రాజా : కాసులకోసం గడ్డినితింటే - కడుపేనిండదురా
కుప్పు: కలబడిమాతో యుద్ధంచేసే ఖలేజా వుందట్రా
ఓట్టాశ్నోయ్ చెడతావ్‌రోయ్ - చిన్నాదోయ్ ఏయ్ ఏయ్ ॥వినరా॥
దండనలె తప్పిన రౌడీ - ధరణిలో వున్నాడా
రాజా : తప్పిపోయిన రౌడీవున్నా - ధర్మం విడువదురా
కుప్పు : ధర్మంతప్పి గొంతులుకోస్తే - తగలబడిపోతావురా
రాజా : చివరకు తప్పదు చెరలోశిక్ష - చింపిరిబుల్లోడా పోరా ॥వినరా॥
సూటిబుద్ధిగలదా నీకు - సౌఖ్యమువస్తుంది
కుప్పు : చెత్తబుద్ధిగలదా చేతికి - బేడీపడుతుంది
రాజా : ధర్మపథాన్ని విడువని(ప్రజకూ - స్వర్గం వున్నదిరా
దారుణకృత్యం చేసేవాళ్ళకు - నరకం తప్పదురా.

నటీనటులు ।

| | |
|---|---|
| రాజా | రవిచంద్రన్ |
| బాబ్బి | నగేష్ |
| రామనాథం | అశోకన్ |
| సోమయ్య | వి. కె. రామస్వామి |
| దేవన్ బహదూరు | సుందర రాజన్ |
| నీలకంఠ శాస్త్రి | రామారావు |
| కాంచన | జయలలిత |
| బేబీ | మనోరమ |

టెక్నీషియన్లు ః

| | |
|---|---|
| మాటలు | మహారథ |
| పాటలు | ఆరుద్ర |
| ఎడిటింగ్ | కందస్వామి |
| స్టూడియో | భరణీ, సారథి |
| ప్లేబాక్ | సుశీల |
| | బాలసుబ్రహ్మణ్యం |
| | నాగేశ్వరరావు |

సంగీతం :

కె. వి. మహాదేవన్ టి. వి. రాజు

డైరెక్షన్ :

శ్రీ పి. రామకృష్ణన్ B. Sc.,

ప్రొడ్యూసరు :

శ్రీ యస్. వి. కృష్ణారావు

---

శ్రీ గాయత్రీ ప్రెస్, విజయవాడ-2

విజయం కంబైన్స్ రిలీజ్.